ఓమ్

శ్రీ శంకరసహాయము.

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

# లోకనాయక శతకము.

బొబ్బిలితా॥ అజ్జాడ వాస్తవ్యులు

బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల రామమూర్తిగారిచే

రచియింపఁబడి,



ఏలూరు వాస్తవ్యులు మహారాజశ్రీ

చీమకుర్తి శూర్మ సుబ్బారాయుడుగారి కుమారుడు

మల్లిఖార్జునుడు శ్రేష్ఠిగారి ద్రవ్యసహాయమున

ఏలూరు రామా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

1924 ఏప్రిల్.

# ఏలూరు, అన్న, వస్త్ర, వైద్య, విద్యాదాన సమాజము, ఏలూరు.

స్థలము శ్రీ పరిభుత్వము వారి ధర్మం. భవనము శ్రీ బొమ్మా రత్నం శ్రేష్ఠిగారి ధర్మం.

మూలధనముగా రు 500 ధర్మముయిచ్చిన శాశ్వతధర్మకర్తలనియు, రు 250 లిచ్చిన శాశ్వతపోషకులనియు, రు 180 లిచ్చిన శాశ్వతసహాయులుఅనియు, రు 150 లిచ్చిన శాశ్వత అభిమాని యనియు రు 100 లిచ్చిన శాశ్వతసభ్యులు అనియు పిలువబడును. అసలుసొమ్ము ఎప్పటికి ఖర్చుపెట్టబడదు. తిరిగి యివ్వబడదు, వడ్డినిబట్టి ధర్మములు జరుగుచుండును. ఇందుకు అన్నదానమునకు మూలధనము ధర్మము రు 60 లు, వస్త్రదానమునకు రు 20 లు, వైద్యదానమునకు రు 60 లు, విద్యాదానమునకు రు 30 లు, రాత్రి మధుకరమునకు రు 30 లు, సహాయముచేసి రశీదులు పొందవచ్చును. ఇందుకు పట్టాలుకూడ 5గురు సంతకములతో నిచ్చెదరు. శాశ్వతధర్మకర్తలకు మాత్రము వారు యిచ్చు ఛాయాపటము సమాజమున అలంకరించబడును. దాతలను యిచ్చిన సంవత్సర రిపోర్టులో ముద్రించబడును. ధర్మములు సోల్ ట్రస్టిగారికిగాని ప్రశిడెంటు లేక వర్కింగుట్రస్టీలపేరగాని పంపి శాశ్వతకీర్తి బడయుదురు గాక.

ఇప్పుడుండు 20 మంది శాశ్వత ధర్మకర్తల వివరం.

మహారాజశ్రీ (1) మోతేగంగరాజు జు॥ (సోల్ ట్రస్టి (2) బొమ్మా రత్నం, (3) చీమకుర్తి మల్లిఖార్జునుడు. (4) గుడిమెట్ల శ్రీరాములు. (5) కొత్తమాసు శ్రీరాములు (ప్రసిడెంటు) (6) మోతే నరశింహారావు జు॥ (7) మోతే నారాయణరావు జు॥ (8) మోతే కృష్ణారావు జు॥ (9)కందులరామయ్య (వర్కింగుట్రస్టి) (10) పోలిశెట్టి గోపాలస్వామి. (11) మన్న గంగరాజు. వై. ప్ర (12) పసుమర్తి రామయ్య. (13) కేసరపల్లి ఆంజనేయులు. (14) బలభద్ర రామకృష్ణయ్య. (15) బలభద్రరామయ్య. (16) తమ్మన వెంకటసర్వేసు. (17) గుజ్జరు వెంకోజి. (18) కొత్తమాసు సీతారామయ్య. (19) కొనకళ్ళ వెంకట సుబ్బారాయుడు. (20) మద్దుల వెంకట చినరాజుగార్లు.



సీ. శ్రీకాంచనుకు క్షత్రకులుండౌ కూర్మ సు
బ్బారాయుడు ప్త సుబ్బమ్మలకును
గారాబపుబిడ్డగా జనించిన వాఁడు
నలఘు యశుఁడు మల్లికార్జునుండు
యువజనసంఘమై యొప్పు హేలాపురీ
గ్రంథాలయమునకు గ్రంథదాత
అన్నదాన సమాజ మన్నదానికి ధర్మ
కర్తయై బీదలఁగాచెడు వాఁడు

గీ. లోకనాయక శతకంబుఁ బ్రాకటగతి
ముద్రణార్థ మొసఁగిన ముఖ్యుఁడితఁడు
లోకనాయక సత్కృపా లోకనమున
నాయురారోగ్య సంపద నలరుఁగాత.



శ్రీ

# లోకనాయకశతకము.

ఉ. శ్రీమదనంతసద్గుణవిశిష్ట వసిష్ఠ మహామునీంద్రము
ఖ్యామలచిత్త మానస విహారమరాళ చరాచరాంతర
స్థామల చిత్కళాత్మ ! నిగమాంతవిభూషణ ! కోటిభాస్కరో
ద్దామవిభావిభాసి ! విబుధవ్రజపాలక ! లోకనాయకా ! 1

ఉ. మూషకవాహనున్ భుజగభూషణు నాశ్రితభక్తలోకసం
పోషకు నేకదంతు సురపూజిత పాదసరోజు మంజుసం
భాషు సమస్తవిఘ్నచయ భంజనశక్తిసమేతు నిత్యసం
తోషు గణేశుఁ గొల్చెదను దోషవినాశక ! లోకనాయకా ! 2

చ. ఒకకరమందుఁబొత్తము మఱొక్కకరమ్మున నక్షమాల వే
రొకకరమందుఁ గంజము నిఁకొక్కకరమ్మున వీణఁ బూని కౌ
తుకమునఁ గానమున్సలుపు తోయజనేత్ర మదీయజిహ్వఁ బా
యక వసియించియుండుటకు నాత్మఁదలంచెద లోకనాయకా ! 3

ఉ. మక్కువ బాదరాయణుని మాన్యుని వ్యాసునిఁ గాళిదాసునిం
దక్కిన మాఘు బాణకవి దండిమొదల్గల దేవభాషఁ బెం
పెక్కినవారి నాహృదిని నెంచి పదంపడి నన్నపార్యునిం
దిక్కన పోతనాదులమది న్వినుతించెద లోకనాయకా! 4

ఉ. శ్రేయముఁగాంచువాని హరిసేవకు నాంధ్రకవిత్వధురు నా
త్రేయసగోత్రపావన సరిత్పతి చంద్రుని సత్యకీర్తి వి
జ్ఞేయుని బంద్రువాడకులశేఖరుఁ గూటమరాజ దానరా
ధేయుని మద్గురున్ మదివిధేయతఁ గొల్చెద లోకనాయకా ! 5

ఉ. మేలగుపండితుండనుచు మేటియశమ్మును గాంచువాని వా
ధూలసుగోత్రపావనునిఁ దోయజనాభ పదాబ్జసేవనో
చ్ఛీలుని వడ్లమానికుల సింధుసుధాంశుని రామమూర్తినిం
జాలనుతింతు నెమ్మదిని జ్యోతిష దేశికు లోకనాయకా! 6

ఉ. పూనితినీకుఁ బద్యశతముల్ రచియించి యొసంగ దాని స
న్మానముతోడ లోన ననుమానము మాని పరిగ్రహించి యా
భాను నిశేశ తారముగఁ బాలనసేయు మనశ్వరాయువుం
బూని వెలుంగునట్లు పరిపూర్ణ కృపంగని లోకనాయకా! 7

చ. పలికియుఁ బల్కలేని తమపాపని పల్కులయందుఁ దల్లిదం
డ్రులు గడుతప్పులున్నను నిరూపణ సేయక వానిఁ గ్రోసి వ
త్సలతఁ గుమారుఁ గాంచి వినుచందము దీనిని తప్పులున్న నొ
ప్పులుగ క్షమించి యీశతకముల్ గ్రహియింపవె లోకనాయకా! 8

చ. చిలుకనుబట్టి పంజరముఁ జేర్చి ఫలాదులొసంగుచున్ మృదూ
క్తులకిటు వీనులొగ్గుచుఁ గుతూహలమొప్పఁగ విందురెల్ల నేఁ
బలికెడి పద్యజాలమునఁ బాఠకులెల్ల రసమ్ముఁ గ్రోలి త
ప్పులుగడు నల్లెదిద్దఁగను బోఁడిమి వేఁడెద లోకనాయకా! 9

ఉ. సారససంభవుండెవఁడు శౌరియెవండు హరుండెవండు బృం
దారక పూజితుండెవఁ డనాథలకున్ గతియెవ్వఁడో జగ
త్కారణ భూతుఁడెవ్వఁడు మొదల్తుదిలేని మహాత్ముఁడెవ్వఁడో
యారయునట్టి నిన్ను మనసార భజించెద లోకనాయకా! 10

ఉ. కర్తవునీవు సృష్టికి జగమ్ములఁ బ్రోచెడి భర్తవీవె సం
హర్తవునీవె లోకముల కాదిమకారణమైన యట్టి ని
న్నార్తశరణ్యమూర్తివని యాగమముల్ ప్రకటించుచుండఁ ద్వ
న్మూర్తి మనమ్ములో సతతమున్ నెలకొల్పెద లోకనాయకా! 11

చ. గుణసహితుండ వంచు నినుఁ గొందఱు మాన్యులు దెల్పుచుండ్రు ని
ర్గుణుఁడ వటంచుఁ గొందఱు నిరూపణచేతురు కొందఱో గుణా
గుణములు లేని మూర్తి వనుకొందురు శక్యముగాదు గాదె నీ
గుణగణనంబుసేయుటకు గోపతికైనను లోకనాయకా! 12

చ. సకలచరాచరమ్ముల విచారణసేయ వెలుంగులెల్ల నీ
వొకఁడవయై వెలుంగుచు మహోజ్జ్వల కాంతివహించి యెల్లవా
రికిఁ దగినట్టి రూపులధరించుచుఁ గోర్కెలొసంగుచుండు నీ
వొకఁడవెగాని దేవుఁడు మఱొక్కఁడుగల్గఁడు లోకనాయకా! 13

చ. పొగడఁదలంచుచున్ నిగమముల్ నినులక్ష్యముచేసి యెన్నియో
యుగములపట్టునన్ శ్రమమునొంది కృతార్థతఁ జెందలేక నీ
సుగుణము లెన్నఁజాల మనుచున్ మనమందుఁ దలంచి యెంతయో
వగపునఁ గుందుచున్ సతమువంచు శిరమ్ములు లోకనాయకా! 14

చ. కనుగొన నెంచి నిన్మునినికాయ మనేకసహస్రవర్షముల్
దనుకఁ దపంబునల్పి బహుధా శ్రమలం గృశియించి వేఱు త్రో
వనుగనఁజాలలేక వనవాసముఁ జేయుచు వేచియుండియై
నను నినుఁగాంచలేమని మనమ్ముల నెంచిరి లోకనాయకా! 15

చ. రజతసువర్ణభూషణ ధరాభట మందిరతల్ప కన్యకా
వ్రజపరిధానయాన నవరత్నతురంగ పటీరభ స్త్రగో
గజ మహిషాదులన్నియు నఖండవిభూతి నొసంగినన్ భవ
ద్భజనకు సాటిరావు భవబంధవిమోచక! లోకనాయకా! 16

ఉ. నాతరమా నినుంగన సనాతనమూర్తివి నీవు నీగుణ
వ్రాతమెఱుంగ శక్యమె పురందరముఖ్యులకైన నైన ని
ర్భీతి వచింపఁబూనితి సరిత్పతినీరములెల్ల పీకమై
చేతము దోఁడఁగా నెడద నెన్ను నరుంబలె లోకనాయకా! 17

చ. మృగములఁబట్టి దెబ్బలులు మొక్కఁడిచాడ్పున మా యఘంబులే
తగని రుజాళులై బహువిధమ్ముల మాతనువుల్ గ్రసించుచుం
డఁగఁ బరికించు చీవు కరుణన్ విడనాడి యుపేక్ష సేయఁగాఁ
తగునె దయాళు! మా రుజలఁ దద్దయుఁజిమ్మక లోకనాయకా! 18

చ. ప్రకటసమస్తతాళగతి రాగము లేర్పడఁబాడి చర్మనా
టకుఁడు మనోహరమ్మునఁ బటమ్మున బొమ్మలఁగీలుకొల్పి పే
శుకుల మనమ్ములందిగిచి కట్టెడుపోలికనీవు లోకనా
టకమున సూత్రధారుని బెడంగువహింతువు లోకనాయకా! 19

చ. రకరకమైనపాములఁ గరండములందు నరేంద్రుఁడుంచి పా
ట్టకుఁ దిరుగాడురీతిఁ బ్రకటంబగు నీసచరాచరప్రపం
చకములఁ ద్రిప్పుచుందు వనిశమ్ము వినోదముగాన యారె! యే
రికిఁదరమా నినుందెలియురీతిఁ గనుంగొన లోకనాయకా! 20

ఉ. కాయము నిల్వఁబోదు, కలకాలము మధ్యనువచ్చి యావన
ప్రాయము నీటిబుగ్గవలెఁ బాయును రోగపరంపరల్ సదా
దాయలరీతిగా బహువిధమ్ముల బాములఁబెట్టిపోవు నీ
కాయము నమ్మరాదు జనకా! నినునమ్మితి లోకనాయకా! 21

చ. గరళయుతాన్నముంగుడిపి కాకము బోయయొకండుజంప నే
కరణినిజుట్టి వాయసనికాయము నెవ్వగజెందిపాయు, న
ట్లరుసమునన్ యముం డదయుఁడై విషయమ్ములద్రోచి ప్రాణినం
హరణమొనర్పనేడ్చి విడు నాప్తసమూహము లోకనాయకా! 22

ఉ. టంకముగల్లు పుత్తడి పుటంబున దోసముపీడఁ గాంతి ని
శ్శంకనొసంగుచుండెడి కృశానునిచందము నాదుపూర్వపుం
బంకములన్ భవచ్ఛరణభాను ఘృణింబడఁద్రోసివేసి యే
శంకయులేనియట్లు ననుసాకవె సత్కృప లోకనాయకా! 23

చ. సదయమనస్కుఁడై గురుఁడు ఛాత్రుని మానసకల్మషంబుఁబో
విదలిచి విద్యనేరిపి వివేకినిగానొనరించురీతి నా
హృదయగపంకముం గరుణ నింకఁగఁజేయుచు దీనపోష ! మీ
పదజలజామృతమ్మునకుఁ బాత్రముసేయవె లోకనాయకా ! 24

ఉ. నావికుఁ డందఱందనదు నౌకనుజేర్చి నదీప్రవాహముం
దావడి దాఁటఁజేసెడి విధమ్మునఁ ద్వత్పద పద్మభక్తియుం
బావనులం బొనర్చుచు నపారభవాబ్ధిని దాఁటఁజేసి సౌ
ఖ్యావహమై మమున్మనుచు నారయనెంతయు లోకనాయకా ! 25

చ. సకలధరిత్రి జీవులకు సౌఖ్యమొసంగెడి భానుకాంతికౌ
శికమున కించుకైనను రుచింపమి మూలలడాఁగురీతిఁ దా
వకపద పద్మభక్తియును బాపికి సహ్యముగాక ఘోరపా
తకములఁ గూలుచుండునుగదా నిరతమ్మును లోకనాయకా ! 26

చ. కరువలిదిండి నోటఁబడి కప్ప దురాశ సమీపమందు సం
చరణ మొనర్చు మక్షికలఁ జయ్యనమ్రింగఁ దలంచునట్లు భీ
కరమగు మృత్యువక్త్రమునఁ గాఁపురముండి నరుండు మోహసా
గరమున మగ్నుఁడై విషయకాంక్షల వీడడు లోకనాయకా ! 27

ఉ. బంధుర గంధవైభవ విభాసుర పంకజ మాశ్రయించి పు
ష్పంధయ మేతెఱంగున నివాసమొనర్చునొ యట్లు ప్రేమసం
బంధముమీఱ నాహృదయ పద్మమున న్వసియించి నీవు మో
హాంధుఁడనైన నన్నుఁగృపనారయగావలె లోకనాయకా ! 28

చ. కలయఁగఁజూచి సర్వమిదికా దిదికాదని త్రోసివేయ ని
శ్చలమయి నిర్వికారమయి శాశ్వతమై కులగోత్ర దూరమై
కలుషవిముక్తముఁ జననకల్మష దూరమునైన బ్రహ్మమై
వెలిఁగెడివాఁడ నేనని వివేకి గ్రహించును లోకనాయకా ! 29

ఉ. ఎంచి దరిద్రుఁడొక్కఁడు ధనేచ్ఛ వహించి ధనేశుఁ జేరి సే
వించి ధనమ్మునొందుగతి విత్తహయాదులఁ గోరి నిన్నుఁ బ్రా
ర్థించఁగ లేదు నాయఘముఁ ద్రెంచినఁ జాలునటంచు నిన్ను యా
చించుచునుంటి దానినగఁ జిమ్మినఁ జాలును లోకనాయకా! 30

ఉ. ఆశభుజంగమై యతిభయంకరమౌగతిఁ బ్రింగఁ బూని యే
దేశము పోదమన్నఁ జనుదెంచుచు నున్నది వెంట సర్వము
న్నాశముఁ జేసిగాని యది నాశముగాదది నిక్క మక్కటా! *
నాశమొనర్పు నీదు భజనంబను యష్టిని లోకనాయకా! 31

చ. సమయము చిక్కుదాఁకఁ గడుశాంతి మెయిన్నటియించి పొంచి మ
త్స్యముల బకంబు బట్టుకొను చాడ్పున మృత్యువు మర్త్యకోటి ని
త్యము వెనువెంటనంటి సమయమ్ము లభించినఁ గూల్చునా యుపా
యము గనలేక జేడ్పడుదు రందఱు మందులు లోకనాయకా! 32

చ.* వినుబదినాల్గు లక్షల వహించితి వేసములోలి నీదు చెం
తను నవికాంచుచుంటివి ముదమ్ము వహించితొ లేదొ? నేనెఱుం
గను ముదమందితేని యొసఁగందగు నీపద మట్లుగాక యుం
డిన నిఁక వేసముల్ వలదు నీకని చెప్పుము లోకనాయకా! 33

చ. యముఁడను ధీవరుండు జగమన్ జలరాశి సమస్తజంతు మ
త్స్యములను బట్టుచుండెఁ గ్రియలన్ బడిశంబులనొడ్డి యా యుపా
యముఁ దొలఁగించుకో వలయునన్నఁ గనంబడె నొక్కటే యుపా
యము భవదంఘ్రిసేవ ననయమ్ము నొనర్చుట లోకనాయకా! 34

ఉ. త్రోవలనాల్గిటన్నడచి తోయనిశాంతముఁ జేరి నీరముల్ ।
ద్రావి మనుష్యులెవ్వరి పథమ్ముల వారలుపోవుచుంట స్వా
భావికమట్టులే యగు భవమ్మున దారసుతాదులున్ భవ
త్సేవయె శాశ్వతమ్ము దయసేయవె గొల్చెద లోకనాయకా! 35

చ. పడఁతులు వేడుకం గుసుమవాటిక యందునఁ బూలుగోయు సం
దడిఁగని వేగవచ్చి విటతండము వారలఁబట్టనోలి ఫో
యెడి కరణిన్ భవాటవి మదింద్రియముల్ విహరింపనంతకుల్
వడిగనుఁ బట్టుకొందు రెడఁబాపవె ? వారల లోకనాయకా! 36

ఉ. నీటిని బాయు తత్క్షణమె నీరజమెట్లు వికాసహీనపుం
బాటువహించునో యటులు భక్తిరసాను భవంబులేనిచోఁ
బాటవముం దొరంగియును బాములనొందియు మాటిమాటికిన్
నీటుదొలంగుఁబో హృదయ నీరజమంతయు లోకనాయకా! 37

చ. సలిలపిపాసఁజెంది పశుజాలము వేసగిలోన యెండనూ
వులఁగని ముందుముందులకుఁ బోయి నిరాశ వహించునట్లు దు
ష్కలుషిత సంసృతిభ్రమల సౌఖ్యములంచుఁ దలంపనట్టియా
తెలిసినవారు నిర్వృతిగతిం జరియింతురు లోకనాయకా! 38

ఉ. వాతముచే మహీజముల పత్రము లేగతిఁ దూలిపోవునా
రీతిగ నీదునామమును రేలుఁ బవళ్ళను నేనరుండు దాఁ
జేతమునందు మానక భజించుచు నుండునొ వానిగామహా
పాతకసంచయమ్ము నెడఁ బాయుట నిక్కము లోకనాయకా! 39

చ. సురలు హిమాంశుబింబమున శోభిలున య్యమృతంబుఁ ద్రావి వి
స్ఫురితమనః ప్రపూర్ణపరిమోదముఁ గాంచు తెఱంగునన్ భవ
చ్చరణ సరోరుహాంతర రసమ్మనయమ్మనుగ్రోలు శేముషీ
భరితులు ముక్తి సౌఖ్యము నపారముగాంతురు లోకనాయకా! 40

ఉ. భానుని కాంతి జీవుల కపారసుఖమ్ములనోలిఁ గూర్చు చం
దాన సమర్థతందగు విధమ్మునఁ ద్వత్పదపద్మభక్తియుం
దానొనగూర్చుఁదన్ను సతతమ్మును గొల్చెడి భక్తకోటికిన్
దీనతఁబోవ సంపదలు దివ్యసుఖమ్ములు లోకనాయకా! 41

చ. కలుషజలమ్ములోఁ గతకగంధముఁ గల్పినఁ దజ్జలమ్ము ని
ర్మలమగురీతిఁ బాతకసమన్విత దుర్మద మానసమ్ము ని
ష్కలుషతఁగాంచు నీభజనగల్గినఁ, గల్గఁగనిమ్ము దానినే
కొలిచెద నిన్ననాతర మకుంఠితభక్తిని లోకనాయకా! 22

చ. శ్రమపడి చిత్రకర్త పలుచందములం దననేర్పుమీఱఁగాఁ
గ్రమముదలిర్ప నాకృతులు వ్రాసిన నయ్యవి రెండు మూఁడు నా
ళ్లు మఱియున్నైదు నాఱుఁ బడి గూడును నీవననెన్నరాని చి
త్రముల ధరాపటమ్మున సదా గనఁజేతువు లోకనాయకా! 43

ఉ. పంకిలుఁడెవ్వఁడేని తన ప్రాంతముజేరఁగ నేస్రవంతినా
వంకకురాకు పొమ్మనక వాని నకల్మషుఁజేయునట్లె నేఁ
బంకయుతుండనొచ్చుఁ దనపజ్జకుఁ జేర నపాపుగాఁగ ని
శ్శంక భవత్కృపాధునియు సల్పుననన్నును లోకనాయకా! 44

చ. సతతమహోగ్రశోకద రుజాపరిపీడితుఁడైనవాని కే
గతి మొదటన్ రుచింపకయు కాలము కొంత గతించునాఁటి క
ద్భుతరుచినిచ్చు పథ్యమునుబోలి భవత్పదభక్తియాదిఁదా
వెతఁదుదిసౌఖ్యమిచ్చుచు వివేకులఁబ్రోచును లోకనాయకా! 45

చ. తొలుత వెలింగనంబడెడి ధూమముపొంతె గృహాంతరస్థమా
జ్వాలనము నిశ్చయించుకొనుచాడ్పునఁ గన్పడు సృష్టివల్లనే
గలవని నిన్నునమ్మి కడుగౌరవరీతిఁ గనంబడన్వివే
కులు భజియింపరే నిను నకుంఠితభక్తిని లోకనాయకా! 46

ఉ. తూలపురాశిఁ దారకలతో నొరయంబొనరించి దానిపైఁ
గీలికణంబువెట్టిన నకించనతంగనురీతి మర్త్యుఁడే
కాలముగాని నీచరణకంజములన్స్మరియించెనేని పా
పాళి నశించిపోవు నదియంతయునీకృప లోకనాయకా! 47

చ. ఎఱుఁగక కోర్కెమైయరిగి యింపుగనుండు కఫంబుపైనఁ దా
నుఱికి చలింపలేక సననోడి తపించెడియీఁగపోల్కె సం
సరణసుఖంబుఁగోరి వివశత్వముగాంచుచు శోకపూరసం
భరితులుగారె మోహహతమానసులెంతయు లోకనాయకా! 48

ఉ. చేతగుడంబుగల్గునెడఁ జీమలమూఁకలు జేరునట్ల యా
రీతిగ బాంధవుల్దనదరిన్ ధనముండిన వెంటనంటుచుం
జేతగుడంబుజెల్లునెడఁ జీమలు బాసిన రీతిగాఁగనే
చేతధనంబుజెల్లుకడఁ జేరరు బంధులు లోకనాయకా! 49

చ. విమలకరుండు రేయిఁ జలివెల్గులచే జగమెల్ల శుక్లప
క్షమున రహింపఁజేసి తిరుగం గ్రమమొప్పఁగ నెట్లు కృష్ణప
క్షమునఁ గళావిహీనుఁడగుఁ గల్మియునట్టులె యోలి వృద్ధినొం
దిమఱి యనంతరంబె కడుదీనత నొందదె లోకనాయకా! 50

చ. కోరెడి కోర్కులెల్ల సమకూర్చు విభుండలపోయ కెన్నఁడున్
స్వైరిణియైన లేమ పెరవారలకై వెతలందుమాడ్కి నిం
పార వరమ్ములిచ్చెడి మహాత్మునినిన్విడి యన్యదేవతా
వారముఁగొల్చి వెంగలియు బంధములంబడు లోకనాయకా! 51

చ. జలజసముద్భవ ప్రథితసౌరభమున్ గ్రహియించు బంభరం
బలకనకంబుఁ జేరఁగ భయంపడు చాడ్పున పుణ్యలోకసం
కలనముఁగోరు భక్తుఁడునగన్ భవదీయ సమీపవర్తియై
యలరుటకుం బ్రయత్నపడు నన్యముఁగోరక లోకనాయకా! 52

ఉ. చింతవహించుచో నినుము చెచ్చెఱఁగుచునుండునాయయ
స్కాంతముపోల్కె నీచరణ కంజము భక్తులఁ జేరఁదీసి య
త్యంత సుఖంబులందనుపుఁ దథ్యము దీని నెఱుంగలేక వి
భ్రాంతులు తద్దకష్టముల పాలగుచుందురు లోకనాయకా! 53

చ. ఎడఁగని కీటకంబు గ్రయిహించి నిజస్థలమందుఁబెట్టి ష
ట్పదము క్రమంబుగాఁ దనదుభంగి నొనర్చెడు రీతిఁ ద్వత్కృపా
భ్యుదయ పరంపరానుగత పుణ్యధనాఢ్యుఁడు నీదురూపసం
పదఁగని ముక్తిసౌధమున భాసిలుచుండును లోకనాయకా! 54

చ. పరుసము సోకఁగానినుము భర్మమయంబయి పూర్వరూపముం
దొరఁగి యమూల్యభావమునఁ దూఁగెడురీతిఁ బ్రపంచమందు నీ
పరమ కృపారసమ్ము భవిపై నొకయించుక చిందెనేని యీ
శ్వరపరరూపియై చెలఁగసంశయముండునె లోకనాయకా! 55

ఉ. హాయనగారడీఁడు మనుజాంబకపంక్తి మొరంగికానఁగాఁ
జేయు సమస్త విద్యలువిచిత్రగతిం గనుపట్టురీతి నీ
మాయచరాచరమ్ముల సమగ్రముగా వెలుఁగంగఁ జిత్రముం
జేయుదువయ్య నీమహిమ జెప్పఁగశక్యమె లోకనాయకా! 56

చ. కనకము నెన్నియో నగలుగా నగసాలి యొనర్చుటన్ జగ
మ్మున బహురూపముల్ గని ప్రమోదముఁగూర్చెడుభంగినొంటివ
య్యును గనరాని నీదు మహిమోన్నతిచేత ననేకదేహ వ
ర్తనఁ బరజీవతన్ స్వకపరభ్రమఁగూర్తువు లోకనాయకా! 57

ఉ. క్షాత్రముఁబూని దుర్జననికాయముఁ గూల్చుచు రాజ సజ్జన
స్తోత్రములందు శిష్టులను దుష్టులఁ జేసియుఁ జిత్రమల్లె మ
చ్ఛత్రుల దుర్మదాదుల హతంబొనరించి శమాదులన్ మహా
మిత్రులఁ బ్రోచినందగిన మెప్పొనఁగూడును లోకనాయకా! 58

చ. తలిరులవిల్తుఁడన్ జెడుగుదయ్యము లోకము నొవహించి త్వ
ల్లలితపదాబ్జ భక్తసుధఁ ద్రావఁగనీయక కామమోహాని
స్తుల మృగభీకరంబగుచు దోఁచెడి సంసరణాట వీస్థలిం
గలతనుబెట్టుచుండె ననుగావవె సత్కృప లోకనాయకా! 59

చ. శవదగ్ధహీనబీజ మెటులగా మొలకెత్తఁగఁ జాలకుండునో
భవదురు పాదపంకరుహ భాస్వరబంధుర భక్తి చాతురీ
వివశముగాని మానసము వేయుభవమ్ములకైనఁ గాంచునే
యవిరళమోక్షవైభవ సముంచితభాగ్యము లోకనాయకా ! 60

చ. నిరతము సత్యవాగ్విభవ నిశ్చలుఁడై జగదేకపూజ్యతా
స్థిరుఁడగు సిద్ధుఁడెట్లు తనదీవనచేతఁ జిరాయురున్నతుల్
గరమునొనర్చునట్టులు జగమ్మున నీకరుణాకటాక్ష వి
స్ఫురణము భక్తియుక్తులకు ముక్తినిఁగూర్చును లోకనాయకా ! 61

ఉ. చందనపాదపంబు సరసన్వసియించెడి చెట్లెల్లఁ గ
మ్మంద సమీరవీజనమునన్మలయక్షితి జాతభావముం
జెందెడురీతి నిన్ను మదిఁజింతనచేసెడివారలెల్ల నీ
చందము వారలొందు ననిశమ్ము సుఖింతురు లోకనాయకా ! 62

చ. తిరములెప్రాణముల్ మెయియధీనము దప్పకనుండు వేళ ని
న్నరయఁగలేని మానవుఁడనంతర మెట్టులుగాంచునిన్ను ? మం
దిరమునయందు దివ్వె కడతేరినపిమ్మట వస్తుసంఘమే
కరణిఁ గనంబడున్ నరునికంటికి వింటివె ? లోకనాయకా ! 63

చ. తనయ సతీ ధనేషణపుదారములంగొని విష్టపత్రయం
బును వృషభమ్ములన్సలిపి ముక్కుపుటమ్ములఁగ్రుచ్చికట్టి చే
తనుగొని యాశనంబనెడి తప్పెటఁగొట్టుచుఁ గైతవాకృతిం
గను వృషనాట్యజీవివనఁగాఁ జరియింతువు లోకనాయకా ! 64

చ. అడవిరసాలసాలము మహాగజమాగుతపీడ కెట్టులో
యొడఁబడి పాంథవర్గమున కొప్పుగ నీడనొసంగి పండ్లని
చ్చెడుగతి సజ్జనుండు పలుచిక్కులకోర్చి పరోపకార సం
పదుఁ బొనరించునుల్లమునఁ బొంగుచు నెంతయు లోకనాయకా ! 65

చ. కనులకుఁ జైపయిన్ సొగసుగాఁ గనుపించి ముసిండిపండు లో
నను విషపూరితంబయి కనంబడుపోలిక దుష్టబుద్ధి నె
మ్మనమునఁ గ్రూరమై పయికి మంచిదిగా సుధలొల్కఁ బల్కులం
గనఁబడి మోసగించుఁ గలకాలము లోకుల లోకనాయకా! 66

ఉ. ఎండిన గడ్డిబొమ్మ నొకటేర్పడఁ జేసియు హాలికుండుగాఁ
వుండఁగఁ బంటపైరుదరినుంచి యతండు చనంగ బొమ్మ కాఁ
వుండియు ముట్టకేఁదినక యుండెడురీతిని విత్తవృద్ధిఁగా
నుండెడు చెంతలోభి నిడుచుందువు కాఁపుగ లోకనాయకా! 67

ఉ. ఆకొని మక్షికల్ సుమములందలి మాధ్వినిఁ బట్టితెచ్చి వ
ల్మీకము లోనఁ బెట్టి విడలేక భుజింపఁగ దానిఁ జుట్టి భ
ల్లూకము పాలఁ జిక్కుఁగతి, లోభియు సంసృతిబద్ధుఁడౌచు నెం
తో కృషిసొత్తుఁ గూర్చి తుదినోడును మిత్తికి లోకనాయకా! 68

చ. అదనున హాలికుండవని యందున విత్తులఁ జల్లి పైరుపెం
పొదవఁగఁ బెంచి తత్ఫలమునొంది సుఖించెడు భంగినాదు హృ
త్పదమున భక్తిబీజము లవారిగ నాటి త్వదంఘ్రిసేవఁ గాం
చదనుకఁ బెంచి సన్నిధినిఁ జూపి భరింపుము లోకనాయకా! 69

చ. ముదము దలిర్పఁ బాలకుఁడు మ్రోలను బెట్టిన స్వర్ణభూషలన్
వదలియనంటి పండులకె బాహువు సాచెడిమాడ్కి భక్తిచే
నెదనిను నిల్పువానికి మహీస్థలి నెట్టి యనర్ఘవస్తువుల్
మదికి రుచింపకుండెడి నమజ్జన పాలక! లోకనాయకా! 70

ఉ. కూరలు పచ్చడుల్ బదియుఁ గూడినఁ నన్నములేని యప్పు క్షు
ద్భారమడంగునే? యటులె తద్దయుభోగ్యము లెన్నియున్న సం
సారము భక్తిశూన్యులకసారము దుస్తరఘోరశోక వి
స్తారముగాఁగఁ దోఁచెడి రసాస్థలినెంతయు లోకనాయకా! 71

చ. ధనముల రాకపోకలవిధమ్ముఁ దలంచిన రేయి స్వప్నమం
దునఁ గననౌచుఁ దెల్విఁ గనఁ దోఁపనిభోగము లై చెలంగు నీ
తనువునశించు నన్నియును దధ్యము నీపదసేవ శాశ్వతం
బని తలపోయుచుం డ్రవనియందు వివేకులు లోకనాయకా! 72

చ. నివురు దొలంగకున్నయెడ నిప్పును బొగ్గుగఁ గానుపించి యా
నివురు దొలంగిన న్నిజము నిప్పిది యంచు స్ఫురించుచుండెడిం
బ్రవిమల మయ్యు నాత్మ భవబంధవశంవద మై శ్రమించి బం
ధవిధురమై చెలంగెడి నితాంతము నాదట లోకనాయకా! 73

చ. తమమున సర్పముం గనుచుఁ ద్రాడని దానిఁ బరిగ్రహింప ను
ద్యమ మొనరించి భంగపడునట్లు నరుండు కరంబు చిత్తవి
భ్రమమున సంసృతి న్సుఖకరం బని నమ్మి చరించు ఘోరదుః
ఖములఁ బడు న్భవత్పదయుగమ్మును నమ్మక లోకనాయకా! 74

చ. ధనికుఁడు నిద్రవోయెడివిధమ్ముఁ గనుంగొని నెమ్మిఁ జోరు లా
ధనమును సంగ్రహించుకొని ధావనముం బొనరించునట్లు తృ
ష్ణను గొన లోన శత్రువులు నాదగుజ్ఞానధనంబు నెల్లఁ జే
కొని చనఁజూచు వానినెటు గూల్చెదవో దయ లోకనాయకా! 75

చ. పరిమళభాసితం బయి యపారముద మ్మొనగూర్చు గంధపుం
దరువునఁ గ్రమ్మి గ్రచ్చ నతతమ్ముఁ గృశింపఁగఁ జేయు గంధబం
ధురమున రమ్యముం జలువు ధోరణి భక్తుఁడు దన్ను జేరి దు
శ్చరితుఁడు కీడొనర్చినను సాకును వానిని లోకనాయకా! 76

ఉ. చీఁకటిరేయి నేగునెడఁ జెంతల బుట్టలఁ జూచి జంతువే
దో కలదంచు భీతిలుచు నొయ్యన భీతిని వీడినట్లు మా
యాకలనమ్మునన్ జగము నంతయుఁ దధ్యముగాఁగ నెంచి వి
ద్యాకలనమ్మునన్ జనుఁడు తత్త్వముగాంచును లోకనాయకా! 77

చ. జలదపతత్పయఃకణముఁ జయ్యన నేలఁ బడంగనీక నే
ర్పలరఁగ వేడ్కఁ జాతకవిహంగము గ్రోలెడురీతిఁ ద్వత్పదా
బ్జలసదనూనభక్త్యమృతసారముఁ ద్రావఁగ సజ్జనుండు ను
త్కలికఁ జెలంగుచుండును గదా నిరతమ్మును లోకనాయకా! 78

చ. సకలదిగంతసంతతికి సంతమసం బెడఁబాపి రాత్రినా
యకుఁడు వికాసముం జలుపునట్టులు నీపదపద్మభక్తియుక్
వికలమనస్కుఁడై మెలఁగు వెంగలికిం దమము న్విదల్చి సా
ర్థకపరమాపవర్గమును దా నొనగూర్చును లోకనాయకా! 79

ఉ. మంచిదొ యుప్పనో జలముమాత్రము పోయుచు నోముచున్న న
భ్యంచితరీతిఁ దా నమృతపాకజలమ్మును బండ్లచేత ని
ప్పించెడి నారికేళతరు వేగతి నాగతి సజ్జనుండు గా
వించును మంచి నెప్పుడవివేకుల కేనియు లోకనాయకా! 80

చ. ఫల మని యెంచి దీపమును భ్రాంతివశంబున మోసపోవుచు
న్నలభము దానఁ జొచ్చి మరణమ్మును బొందినయట్లు భక్తిసం
కలనము లేమి దుర్జనుఁ డగాధపుసంసరణమ్మునందు బా
ములఁబడుచున్నఁ జేచ్ఛఁగదుమోసమునొందునులోకనాయకా. 81

చ. సొలసి కృశించుపన్నగకిశోరముపైఁ గరుణించి పెంపు సొం
పలరఁగఁ బాలు వోసి యనయమ్మును బెంచినఁ గాలకూటపుం
గలుషపురీతి వీడనటుగాఁ దను నమ్మినవారిఁ గ్రూరుఁ డ
గ్గలముగ మోసగించెడు జగమ్మున నెంతయు లోకనాయకా! 82

చ. అడవిఁ జరించు భీకరమృగౌఘముల న్మృగయుండు పట్టి యే
వడువునఁ గూల్చునో యటులు భక్తుఁడు సంసరణాటవిం గడుం
గడు విహరించు దుర్విషయఘాతుక ఘోరమృగాళిఁ ద్రుంచి యె
ప్పుడు సుఖియించుచుండు ముదముంగని నీకృపలోకనాయకా! 83

చ. అమలతయు న్సుగంధ మిసుమంతయు నుండక యున్న పుష్పహా
రమునఁ బెనంగుటల్ జనశిరమ్ముల గౌరవ మొందు సూత్రమే
క్రమమున నాశ్రమమ్మున విరాజితసజ్జన సంగతిఁ దురం
తముల నొనర్చువాఁడును ఘనత్వముగాంచును లోకనాయకా! 84

చ. ఎనయుచు వృశ్చికమ్ము తనకే యుపకారముఁ జేయకుండినం
జనులకు నేవిధమ్మునను నల్పునొ కీడటులే సతమ్ము దు
ర్జనుఁడు మహోపకారములఁ జల్పుచు సజ్జనకోటి కిన్సదా
ఘనకలుషమ్ముచేత నరకమ్మును బొందును లోకనాయకా! 85

చ. మనుజుఁడు స్థాణువుంగని భ్రమంబుపురుషుండని చేతమందు నెం
చినగతిగా శరీరమదిచిత్తముదానను కొంచు దుర్భ్రమం
బునుబడి నీదుభక్తి ననుభూతి నెఱుంగఁగ లేక యెన్నియో
వనటలఁ జెందుచుండు భవవార్ధిమునుంగుచు లోకనాయకా! 86

ఉ. ద్వారనిబద్ధమా గృహము దాహమునొందఁ బడి వేళలో నగుం
డే రమణ న్వాలింబడుట కిచ్చవహించునొ యట్టిరీతి వి
స్తార విషాదదుస్తరణ సంసృతి బద్ధుఁడు త్వత్పదాబ్జ సే
వారతుఁడు న్విముక్తికయి వాంఛ యొనర్చెడు లోకనాయకా! 87

చ. పటుగతి భూమినీరశిఖవాయు నభమ్ములఁ గూర్చి నేర్పుమై
ఘటము నొనర్చుచుండు ఘటకారుని తీరున నీప్రపంచ మం
తట నిముడంగరాని మెయి తొల్పులఁ జిత్రముగాఁగ నాశికా
పుటముఖనేత్ర భేదములఁ బొల్పొనర్తువు లోకనాయకా! 88

చ. అలసు లపస్వరాల శ్రుతినభ్యససంబొనరించి లాభమె
ట్టులుఁగన లేక యోడుదు రటుల్ మది నెంచక దుష్టకార్యసం
కలన మనోరథమ్ములనె కాలముఁబుచ్చెడువారు జన్మ ని
ష్ఫలతనుగాంచి రౌరవముపాలగు చుందురు లోకనాయకా! 89

చ. మెఱుఁగిడి సంతకంతకును మేలిమిపైడి పుటంబువెట్టి నం
దరచిన సంతకంతకును దావకభక్తులయందుఁ గాంచనౌఁ
బరమ పవిత్రతాగుణ విభాసురతావిభవమ్ములెంతయు
న్వరకరుణా సముద్రనతభక్త నృనాయక లోకనాయకా! 90

చ. వనమునఁ జెట్ల రాపిడిని వహ్ని జనించి క్రమక్రమంబుగా
ఘనమయి సర్వవృక్షములఁ గాల్చెడిరీతి నదృష్టలబ్ధ స
జ్జన సహవాస జంబగు లసద్భవదీయ పదాబ్జ భక్తి పా
వనులఁ బొనర్చు మానవుల పాపములూడిచి లోకనాయకా! 91

చ. పలుకునఁ దేనెలొల్కఁ బసిబాలకుఁ డమ్మయటంచు నొక్కమా
ర్పిలిచిన యంతఁ దల్లి కడుప్రేమ దలిర్పఁగ స్తన్యమిచ్చున
ట్లిలనిభవత్పదాబ్జగ సమీడిత భక్తిధురంధరుండు నిం
బిలిచిన మాత్రముక్తినిడి పేర్మినిఁ జూపుదు లోకనాయకా! 92

ఉ. ముప్పగు నీభవంబను సముద్రము నీదగఁ జొచ్చి డస్సియో
తిప్పకుఁ జేరఁజాలక ధృతింజెడియుంటి నెఱుంగ లేకనా
తప్పుసహించి యీతరినిఁ దావకపాద సరోజ యుగ్మమ౯
దెప్పనొసంగినన్ను దరినింబడవేయవె లోకనాయకా! 93

చ. ధనమునులోభి యన్యులకుఁ దానమొనర్పఁడు నష్టమైనఁ దా
ననుమతిఁ జెందు నెట్టి సమయమ్మున నేన్భవదీయనామ చిం
తనమొనరింపకుండును వృథామతిఁ బుచ్చును గాలమెల్ల దు
ర్జనుఁడు తరించుటెట్టులిఁక సంసరణాంబుధి లోకనాయకా. 94

చ. అరయుచు మేఁకవన్నెపులి నాత్మకుల ప్రభవంబటంచునా
దరమున భ్రాంతినొందుచు యథాస్థితినుండుటచేత మృత్యువే
శరణినిఁ బొందు నాగతినగాధ మహాకపటాంతరంగులౌ
దురితులఁ జేరి సజ్జనులు దుఃఖముగాంతురు లోకనాయకా. 95

చ. బలమగు వాయువేగమునఁ బట్టుదొలంగుచు భూరుహంబు దు
ర్బలమయి భూతలమ్మున గుబాలునఁగూలెడు రెల్లువంగియె
ట్టులొ పడిపోకనిల్చును బటుస్మయుఁడెంతయు విఱ్ఱవీఁగి బా
ధలఁబడునమ్రుఁడొందెడిని దప్పకయున్నతి లోకనాయకా. 96

చ. చలువలరాయఁ డెప్పగిది సస్యములన్ ఫలియింపఁజేసి లో
కుల కుపకారియై యెపుడు గొప్పతనమ్మున నొప్పుచుండునో
తలఁపనటుల్ భవచ్ఛరణ దాసులపాలిట నీకుసత్కృపా
కలనము సర్వసంపదలఁ గ్రన్ననసీయదె లోకనాయకా 97

ఉ. కాయలఁ బిందెల్లన్ సుమనికాయముతోఁ దరువొప్పుచుండఁ బె
న్వాయువువచ్చిదానిఁ బడవైచిన చందము పృథ్విలోననే
న్యాయమునంజరించు సమయమ్మున మృత్యువునన్నుబట్టి య
న్యాయముగాఁగఁ గొంచుజనునప్పుడు బ్రోవవెలోకనాయకా. 98

చ. నయమొకయింతనేరని మనఃకపి నిత్యముసుందరీశిలో
చ్చయసమమాంసలస్తన కుజమ్ములఁదద్దయు నాసకొమ్మలన్
భయమును వీడిగంతులిడు; భద్రమెటుంగని యట్టిదానినీ
నయతర భక్తివల్లిఁ గరుణంగని కట్టుము లోకనాయకా. 99

చ. తనయుఁడు మూఁఢుఁడైన బహుతామసుఁడైనను నంగహీనుఁడై
ననుఖలుఁడైన మూగయయినన్ జనకుండు కుమారునెల్లు పో
షణమొనరించునట్లె నను సాకుము నేమరితాత్మకుండనీ
తనయునిపోషణమ్మునకుఁ దామస మేలకొ లోకనాయకా 100

ఉ. తోయజు బంధుఁడంబుజినితోఁ గవయున్నదిః నిశ్చయించి హ
స్తాయతవృద్ధిఁదాను మనసార స్పృశించి వికాసమొందఁగా
జేయు విధానజ్ఞాన రవిచెల్మి మనోబ్జినికిం బొనర్చుచుం
బాయని నిద్రవాపి నను బాలనసేయవె లోకనాయకా. 101

చ. పగటిటుడగ్ మహీరుహనివాసము నల్పి ప్రభాతవేళఁజూ
డఁగదెస కొక్కటై చనఁగడంగు విహంగములట్లు దుస్తరం
బగుభవమందు దార తనయాదులుగూడుచు వీడుచుండురీ
జగతి భవద్ధయారసమె శాశ్వతమై తగు లోకనాయకా. 102

చ. ఖరకరు బింబమున్మొగులు గప్పఁగ వాయువుదాని దూల్చి భా
స్కరుని వెలుంగఁ జేయుగతిగా హృదయచ్ఛదమౌతమంబుఁ త్వ
ద్వరకరుణా సమీరమున భంగమొనర్చుచు నాదుజ్ఞాన భా
స్కరు నిజకాంతితో మెలఁగఁగా నొనరింపవె లోకనాయకా. 103

ఉ. రాజిత కీర్తిశాలి మునిరాజకృపారసవార్ధి యాభర
ద్వాజయమీంద్రుఁడౌ నరఘువంశమునం జనియించె విద్వదం
భోజభవుండు నాగనుతిఁబొందిన రామయ లక్ష్మి భర్తని
ర్వ్యాజుఁడు మత్పితామహుఁడు త్యాగియుదారుఁడు లోకనాయకా.

ఉ. ధీయుతుఁడౌచు లక్ష్మియను దివ్యపదమ్మునఁ గూడి యొప్పి నా
రాయణుఁ డన్నపేరున విరాజిలువాఁడవధాని శ్రీయుపా
ధ్యాయుల వేంకటార్యునకుఁ దత్సతి సుబ్బమకుం దనూజకా
త్యాయని సాటిపాపమయుఁ దల్లియుఁ దండ్రియు లోకనాయకా. 105

ఉ. వేఁడుచున్నవాఁడ నినువేయు విధమ్ముల నన్ను బ్రీతిగా
పాడుమురామమూర్తి యనువాఁడ భవత్పద సేవకుండనీ
వాఁడనునీవె నాకెపుఁడు బ్రాపని నమ్మికనున్నవాఁడన
జ్జాడ పురీనివాసకుఁడ సాధువిధేయుఁడ లోకనాయకా ! 106

ఉ. ఈశకమ్మఁగోర్కెదీనిఁగలి నేఁబదివందల నిర్వదేను ర
క్తాక్షినిఁ జైత్రశుద్ధవిదియన్ రవివాసరమందు భక్తసం
రక్షకతా మహామహిమరాజిలు నీకృపఁ బూర్తియయ్యె బ్ర
త్యక్షముకండెకావలె సుమా యిఁకనీమది లోకనాయకా ! 107

ఉ. నీ కరుణారసమ్ము ధరణిన్ బ్రవహించుచు సస్యవృద్ధుల
న్మాకొనగూర్చుతన్ నృపులుక్ష్మాతలమున్ నయమొప్పఁ బేర్మిమై
సాకుచునుంద్రుగాత శ్రుతిశాస్త్ర సమభ్యసంబు పొల్చుతన్
నాకృతి యాబ్జతారముఁ దనర్చుత నెంతయు లోకనాయకా! 108

లోకనాయక శతకము,

సంపూర్ణము.

# హిందూ యువజనసంఘ గ్రంథాలయము.

(స్థాపితము 1904 సం॥రం.)

---

ఇందు 8000 వరకు ఆంగ్ల, ఆంధ్ర, సంస్కృత గ్రంథములుగలవు. ఇచ్చటకు, ఆంధ్ర ఆంగ్ల మున్నగు, దిన, వార, పక్ష, మాస పత్రికలు వచ్చును. ప్రతివారు ఉచితముగ వచ్చి చదువుకొనవచ్చును. ఇందు రు 1000 లు, విలువగల మ్యూజికులాంతరు కలదు. గ్రంథములు ఇండ్లకు దీసికునేయెడల నెల 1-కి 0-4-0, 0-8-0 చందాలు ఇవ్వవలసియుండును. ఈ సంఘము రిజిస్టరు అయినది. మ॥రా॥శ్రీ మోతే గంగరాజు జమీందారుగారు దివ్యభవనము కట్టించుచున్నారు. ఆదాయమును మించి వ్యయము అగుట సంభవించకుండా ప్రతివారు యథాశక్తిని, అన్నివిధముల (గ్రంథములు, విరాళములు, నెలచందా లు) ఇచ్చి రశీదులు పొంది మా యుద్యమమునకు తోడ్పడెదరుగాక! యీ సంఘమునకు ధర్మకర్త అధ్యక్షులు మోతే గంగరాజు జమీందారుగారు. ధర్మకర్త సభ్యులు మద్దుల వెంకటచిన్నరాజు చదలవాడ చక్రధరరావు డాక్టరు. తాడేపల్లి గంగరామయ్యగార్లు సంఘ ప్రసిడెంటు దీ॥ బ॥ మోచర్ల రామచంద్రరావు పంతులుగారు. వైస్ ప్రసిడెంటు మోతే నారాయణరావు జమీందారుగారు. ట్రెజరరు తమ్మన మాణిక్యంగారు గ్రంథాలయాధిపతి చింతా సోమరాజుగారు. కార్యదర్శులు కొండూరి నారాయణరావు, మహమ్మదు జాఫరల్లీ సాహేబుగార్లు.

# ఏలూరు, గోసంరక్షణ సమితి.

(స్థాపితము ది 25-1-1918 సం॥రం.)

---

☞ స్థలము—,, శ్రీ తాటికొండ సుబ్బారాయఁడు గారిచే నిర్మింపఁబడిన శ్రీరాములువారి ఆలయపు కాంపౌండులో పవరుపేట, ఏలూరు. ''

---

ఈ సమితికి, మ॥ రా॥ శ్రీ మోతే గంగరాజు జమీందారు రు, ప్రసిడెంటు. మ॥రా॥శ్రీ పోలిశెట్టి గోపాలస్వామిగారు (కార్యదర్శి), లేక మ॥రా॥శ్రీ అప్పన వెంకయ్యగారు(ట్రజరరు), పైవారిలో నెవరి పేరనైన, విరాళములు పంపించి, రశీదులు పొందవచ్చును. గడ్డి, తవుడు, నెలచందాలుకూడ యివ్వవచ్చును. ఇందు దిక్కులేనిగోవులు పోషింపబడును. పాలువున్నచో, బీదపిల్లలకు ఉచితముగ సహాయము చేసెదరు. గోవులు మంచి స్థితిలోనికి వచ్చినయెడల గృహస్థులకు అమ్మబడును. ఇట్టి హిందూధర్మమును అందరు ఆదరించి గోమాత ఆశీర్వచనము బడయుదురుగాక !

---

